సంపుటము 1]　　　జూన్ 1915　　　[సంచిక 12

# బాలమిత్ర



## దినము లేమగుచున్నవి?

అమ్మా దినములెక్కడనుండి వచ్చుచున్నవి? అని చిన్న జాక్ తనతల్లి నడిగెను.

తల్లి, "నాయనా, అవి దేవుని యొద్దనుండి వచ్చుచున్నవి. ప్రతి ఉదయమును క్రొత్తదినము వచ్చుచున్నది. అది దేవుని దానము. ప్రతిదినమును, క్రొత్తదియు, పవిత్రమైనదియు, మంచిదియునై యున్నది. మనము వాటిని మంచి పనులతోను, మంచి తలంపులతోను, దయగలమాటలతోను నింప

ప్రతివారిదినము వేరువేరుగా నున్నది. నీ దినము నా దానివంటిదిగాని, నాకి నీ దానివంటిదిగాని కాదు. నీ దినమును మంచివాటిచేత నీవే నింపుకొనవలెను గాని నాకు చేత కాదు. నేనుగాని, నాయనగాని నీకు సహాయముమాత్రము చేతుము గాని మరేమియు చేయులేము. నీ దినము నీదే. అది దేవుడు నీ కిచ్చినవరము. నీ కిష్టమువచ్చినట్లు నీవు దాని నింపవలెను.

చిన్నజా నదివిని ఈ కొంచెము సేపటివరకు మౌనముగా నుండి తరువాత మరల, «అయితే అవెచ్చటికి పోవును» అని మరల అడిగెను.

«అవి దేవుని యొద్దకే బోవును. మనము వేటిచేత నింపితిమో వాటితోనే అవి ఆయనయొద్దకు వెళ్లును. ప్రతి ఉదయము అది మనకు ఒక తెల్లని కాగితమువలె వచ్చును, మనము ఆ దినమున చేసిన పనుల పతములతోను బొమ్మలతో నది రాత్రియందు దేవునియొద్దకు బోవును.»

చాలకాలమువరకు జాన్ నెమ్మదిగా నుండెను. అతడు చాల తలంచుచున్నాడని తల్లి గ్రహించెను. చివర కతడొక నిట్టూర్పువిడచి తల్లివంక జూచెను.

«నాయనా! ఎందు కాలాగున్నావు?» అని తల్లి యడిగెను.

«ఇదివరకు నేను గడిపిన దినములు తిరిగివచ్చినయెడల చాల బాగుండుననుకొనుచున్నాను. కొన్ని దినములు నేను

చేసిన వికారపుపనులతో నిండియున్నవి. అవి దేవుని యొద్దకు బోవునని తలంచలేదు.”

తల్లి వాని ముద్దుబెట్టుకొని “నాయనా, నీవు తలంచునది నాకును బాగుగా తెలియును. దేవునికి మరి బాగుగా తెలియును గనుక ఆయన నిన్ను క్షమించి, ప్రేమించును. ఆయనకు మన అన్ని సంగతులు విశదముగా నున్నవి. దేవుని ధ్యానమును ఈ దినములు ప్రతిదినము మనము చేయువాటితో నింపబడి, రాత్రులయందు దేవునియొద్దకు బోవుననియు, ఆయన ప్రతిదానిని చూచునని తలంచుటవలన మనకు చాల సహాయము కలుగును గాక” అనెను.

“అమ్మా, ఇదివరకంటె ఇకమీదట ఇంకా బాగుగా బ్రతుకవలెననుకొనుచున్నాను. దేవుడు నాకు సహాయము చేయును గాక! గతించిన కొన్ని దినములను గూర్చి నాకెంతో సిగ్గుగా నున్నది” యనెను.

# ఒక బొట్టు తేనె, దానివలన కలిగిన నష్టము

ఒక మహమ్మదీయుడు బజారునకు వెళ్లి కొంచెము తేనెను కొనెను. అందులోనుంచి ఒక బొట్టు తేనె క్రిందపడెను. ఒక ఈగ వెంటనే తేనెమీద వ్రాలెను. దగ్గరనున్న బల్లి



యొకటి దానిపైబడి పట్టుకొనెను. ఇంతలో ఆ అంగడివాని పిల్లి ఆ బల్లిని పట్టుకొనుటకు దూకెను. దూకగానే ఆ మహమ్మదీయునికుక్క పిల్లిపై బడెను. ఆ అంగడివాడు ఊరకుండక దగ్గరనున్న కత్తితీసికొని ఒక్కదెబ్బతో కుక్కను చంపెను.

ఆ ఒక్క తేనెబొట్టు క్రిందపడినందున ఎంతకీడు కలిగెనో చూడండి. ఇంతటితో అది ముగిసిపోయినయెడల చాలమేలే గాని తనకుక్కను చంపినందుకు మహమ్మదీయుడా అంగడి వాని పట్టుకొని నాలుగు దెబ్బలిచ్చెను. ఇంతలో అంగడి

వాండ్లందరును ఏకమై వానిమీదకు వచ్చిరి. వీరు పైకిరాగానే దగ్గరనున్న మహమ్మదీయు లందరును తమ సహోదరునికి సహాయము వచ్చిరి. ఈలాగున కొంచెముసేపటిలో పట్టణములో నున్నవారందరును రెండుభాగములై ఒకరితోనొకరు పోట్లాడుకొని ఒకరినొకరు చంపుకొనిరి.

అంతయు నెమ్మది అయినపిదప, ఈ అల్లరియంతకును కారణమేదని విచారించి ఇదియావత్తును ఒక చిన్నబొట్టు తేనెవలన వచ్చినదని తెలిసికొనిరి.

బహు కొద్ది కారణములే గొప్ప కలహమును కలిగించును.

## చేతులు

కండ్లకు తరువాత మన దేహమునకు మిగుల ఉపయోగకరముగా నుండునవి మనచేతులే. ఎవరిచేతనైనను నీ చేతులను వెనుకకు కట్టి వేయించుకొనుము కొంచెముసేపటిలో నీవు ఎంత అదృష్టహీనుడవో చూడగలవు. అప్పుడు, చేతులు కట్టబడక పోయినయెడల ఎన్నిపనులు చేయగలవో జ్ఞాపకము తెచ్చుకొనుము. గుఱ్ఱము నీవు చేయగలిగినన్ని పనులు చేయునా? నీ చేతివంటి చేయియేగల కోతిని ఎప్పుడైనా చూచియుంటివా! అది తక్కిన జంతువులకంటె ఎన్ని



జిత్తులుచేయునో గుర్తించుము. కుట్టుటకును, తమ శరీరముల దుమ్ము దులుపుటకును, చిన్నపాత్రలనెత్తి త్రాగుటకును ఇంకా అనేకపనులను నేర్పవచ్చును. దేవుడిచ్చిన వరములన్నిటిలో చెయ్యి మనుష్యునికి మిగుల శ్రేష్ఠమైనదని ఒకరు చెప్పిరి. జంతువులకన్నిటికి, కండ్లు, చెవులు, నాలుకలు, ముక్కులు గలవుగాని మనుష్యునికిమాత్రమే చేతులున్నవి. వాటిని సరిగా ఉపయోగించుటకు తగిన జ్ఞానము మనకున్నదా?

కం|| ఉదయంబున నా చేతుల
బదిలంబుగ గడ్గి శుభ్రపరచిన వెనుకన్
సదమల ప్రభుడగు యేసుని
బదముల సేవింపనిచ్చి - ప్రణుతులొనర్తున్.

# ప్రకృతి పాఠములు

## 11-వ పాఠము

### వేరు

విత్తనమును భూమిలో పాతినపిదప రెండు మూడు దినములకు జాగ్రత్తగా పెళ్లగించి చూచినయెడల భూమి పైకివచ్చిన భాగమొకటియు, భూమిలోనికి వెళ్లిన భాగమొకటియు రెండు కనుబడును. మొదటిది చాలవరకు ఆకుపచ్చగా నుండి రెండు లేక మూడు చిగురటాకులను గల్గియుండును. దీనినిగూర్చి ఇకముందుకు మనము నేర్చుకొందముగాని, నేటి పాఠములో, పాలిపోయి, పోనుపోను సన్నబడి, అనేక కొమ్ములుగా విడబారిన దానినిగూర్చి కొంత నేర్చుకొందము. దీనికే „ వేరు '' అని పేరు.

నీకు నోరు ఏలాగు అవసరమో చెట్లకు వేరులు ఆలాగే అవసరము. తమకు కావలసిన యాహారమును చెట్లు వేరుల ద్వారా లోనికి తీసికొనును. నీవలె చెట్లు తమ ఆహారమును ముద్దలుముద్దలుగా మ్రింగనేరవు. నీవు తిను భోజనము రక్తముగా మారక మునుపు ఏలాగు నీటివలె ద్రవపదార్థముగా కావలెనో, చెట్లకును అదేరీతిని, వాటి యాహారము ద్రవ

రూపములో నుండవలెను. చెట్ల యాహారము భూమిలో నున్నది. గాని అది ద్రవపదార్థమున లేదు. గనుకనే మనము చెట్లకు నీరు పోయుచున్నాము. చెట్ల ఆహారము నీటిలో కరిగి ద్రవరూపమై, చెట్టుయొక్క వేరులగుండా చెట్టుకెక్కును.

చెట్టుయొక్క వేరులకు నోళ్లనేకములు. అవి చాల చిన్నవి. ఒక చిన్నచెట్టును జాగ్రత్తగా పెళ్లగించి చూచిన యెడల పైన కొమ్మ లేలాగు అనేక దిక్కులుగా వ్యాపించి పోనుపోను సన్నమైనవో, అలాగే వేరును, మొదట లావుగా నుండును. దీనికి "తల్లివేరు" లని పేరు. ఇది చాల బలముగా నుండి భూమిలోకి చాలదూరము చొచ్చుకొనిపోవును. దీని నుండి అనేక శాఖలు నానాదిక్కులకు పోవును. ఇవి పోను పోను సన్నగానుండి చివరను వెండ్రుకలవంటివాని ననేకము లను కలిగియుండును. వీటికి నీటిని పీల్చుకొనుగుణము విశే షముగా నుండును. వీటికి "వేరువెండ్రుక" లని పేరు.

ధాన్యాదుల మొలకలయొక్క వ్రేళ్లకును, ఇతర చెట్ల వ్రేళ్లకును చాల భేదముగలదు. ధాన్యాదులవ్రేళ్లు సన్నని దారములుగా నుండును. వీనికి నులివ్రేళ్లని పేరు. ఇవి మొక్కయొక్క మొదలున చుట్టును గుంపులు గుంపులుగా పెరుగును. ఆ మొక్కలు కొంతకాలముమాత్రమే ఉండును గాన, విశేషముగాను, చెట్టుకు ప్రయోజనకారులుగా నున్నవి.

కొన్ని చెట్ల వేరులు లావుగా బలిసియుండును. ఇట్టివాని మనము "గడ్డలు"ని గాని "దుంపలు"ని గాని యందుము. గనుసుగడ్డ, ఆ చెట్టుయొక్క వేరు, కంద, చేమదుంప, వస మొదలయినవి ఆయా చెట్ల యొక్క వేరులే. ఈ చెట్లు తమకు కావలసినదానికంటె యెక్కువ ఆహారము భూమిలోనుండి తీసికొని, దానిని కరవుకాలముకొరకు నిలువచేసి యుంచుకొనును.

వేరులు చెట్ల కాహారము సంపాదించుటమాత్రమే గాక చెట్లు నిలుకడగా నిలువబడునట్లుపయోగించును. పెద్దపెద్ద గాలులుకొట్టి చెట్టు నటుయిటు ఊపినప్పుడు ఇవి చెట్టును పడకుండ ఆపును.

ప్రతిబాలుడును బాలికయు, వేరులవలె నుండుటకు ప్రయత్నించవలెను. అనగా యేమిటో తెలియునా?

---

## కంగరూ

కంగరూ అనునది నాలుగు కాళ్లుగల ఒక పిరికి జంతువు. పిల్లలనుకని పాలిచ్చి పెంచుజాతిలోనిది. అది పచ్చిగడ్డి, ఆకులు, చిగుళ్లు, వేళ్లు మొదలైన వానిని దినును.

కంగరూ జంతువులలో అనేక రకములు గలవు. కొన్ని చెవుల పిల్లులంత చిన్నవి; మఱికొన్ని మనుష్యులంత పెద్దవి.



ఈ జంతువు నడుమువద్దనుండి పైన తలవైపునకు సన్నముగను. తోఁకవైపునకు లావుగను ఉండును. ముందు కాళ్లు పొట్టివి. ఈ కాళ్లతో అది దేనినైనను పట్టుకొనును. నేలలో గుంటలు త్రవ్వుకొనును. వెనుక కాళ్లు చాల పొడుగుగ ఉండును. అందుచేత అది మిగుల సులభముగ దుముకఁగలదు. తడవకు ఇరువది అడుగుల చొప్పున దుముకుచు చాలదూరము పోఁగలదు. గుఱ్ఱమునకంటె వేగముగ పరుగెత్తఁగలదు.

ఆఁడుదానికి కడుపు క్రింద సంచి ఉండును, పిల్లను ఆ సంచిలో పెట్టుకొని దుముకుచు వెళ్లును. కంగరూ తడవకు ఒక్కపిల్లను ఈనును. పిల్ల పుట్టినదిమొదలు సుమారు ఎనిమిది

నెలలు వచ్చువఱకు తల్లి సంచిలోనే ఉండును. తరువాత మెల్లగా సంచిలోనుండి దిగి తల్లివద్దనే తిరుగుచుండును. అప్పుడప్పుడు సంచిలో ఉండియే తల బైటపెట్టి తల్లితో పాటు మేత మేయుచుండును.

కంగరూ తోఁక మిగుల బలముకలది. వెనుకటి రెండు పాదములమీఁదను, తోఁకమీఁదను గూడ కూర్చొనును. అప్పుడది ముక్కాలి పీటమీఁద కూర్చున్నట్లు ఉండును.

కంగరూ జంతువులు ఆస్ట్రేలియా ఖండమునందును దానికి చుట్టుప్రక్కలనుండు లంకలయందును ఉండును. దానిమాంసమును తినెదరు. చర్మముతో చెప్పులు కుట్టుదురు. ఈ కారణముచేత దీనిని గుఱ్ఱములమీఁద వేటాడుదురు. ఈ వేటలో దానికి వేటకుక్క దొరికిన యెడల దానిని ముందు పాదములతో పట్టుకొనిపోయి నీటిలోముంచి చంపియైనను వేయును; లేదా వెనుకకాళ్లతోఁ జీల్చివేయును. ఈ విధముగా అది తన శత్రువులనుండి తప్పించుకొనుటకే దాని వెనుకటి పాదములకు బలమైన గోళ్లు కలవు. ఈ జంతువునకు దాహముతక్కువ, అందుచేత నీళ్లుత్రాగకుండ చాలకాలముండఁగలదు. ఈ జంతువులను మచ్చికచేసి పెంచుకొనవచ్చును.

# ఈసాకు

ఈసాకు, అబ్రాహాము శారాలకు మిగుల ముసలితనమున గలిగిన ఏకపుత్రుడు. శారా తనయొక్క వృద్ధాప్యముననున్న బలహీనతను పూర్తిగా మరచియుండి తన ముద్దులబాలకుని ముచ్చటమాటల వినుచు మిగుల సంతోషముగా నుండెడిది. తండ్రి అబ్రాహామును బహుకాలమునకు గలిగిన బాలుని ముద్దుచేష్టల చూచుచు మిక్కిలి ఆనందించువాడు. ఇట్లుండ ఒకనాడు దేవుడు, అబ్రాహాము తన్ను ముందువలె పూర్ణముగా ప్రేమించుచున్నాడా లేక కుమారుని పుట్టుకనుబట్టి కొంతప్రేమ తగ్గినదా యని పరీక్షించుటకు కోరి, అబ్రాహామును పిలిచి “అబ్రాహామా! నీ ఏకపుత్రుని నాకు బలిగా నర్పింతువా” అని యడుగ ఎంతమాత్రము వెనుకదీయక, “చిత్తము ప్రభువా నీవు కోరినట్లు చేసెదన”ని చెప్పి, కుమారుని పిలిచి వెంటనే బలి అర్పించుటకు బయలుదేరెను. ఇద్దరును చాలాదూరము వెళ్లిన పిదప, ఈసాకు తండ్రివంకచూచి “నాయనా! బలి అర్పణకు కట్టెల తీసుకొని పోవుచున్నామే. గొఱ్ఱెపిల్ల ఎక్కడ?” అని అడుగ అబ్రాహామునకు స్వాభావికముగా అందరు తండ్రులకువలె కుమారునిపై అధిక ప్రేమయున్నను,

ఆ కాలమునకు పొర్లివచ్చిన కన్నీళ్ళ దిగమ్రింగి, "నా కుమారా! ప్రభువే దాని సిద్ధపరచున"ని బదులిడెను. ఇది జరిగినపుడు ఈసాకు చిన్నవాడనుకొనుచున్నారా? లేదులేదు. ఇరువది ఏండ్లు మించిన ప్రాయముగలవాడే. అయినను తండ్రి మాటను శిరసావహించి వినెడి విధేయబాలుడు. సరే, తండ్రి కుమారులు చేరవలసిన బలి అర్పణస్థానము చేరిరి. కట్టెల అర్పణకుగాను పేర్చిరి. అంత అబ్రాహాము కుమారుని దానిపై పరుండబెట్టి, కత్తిని పైకెత్తి కుమారుని వధించబోగా "అబ్రాహామా! అబ్రాహామా! అలాగువద్దు, వద్దు" అని యొక శబ్దము వినవచ్చెను. అంత అబ్రాహాము తిరిగి చూడగా నొక మంచి పొట్టేలు పొదలో కాన్పింప దాని తీసుకొనివచ్చి మండుచున్న కట్టెలపైనుండి కుమారునిదీసి, దానిపెట్టి, వధించి, ప్రభువునకు బలినర్పించి, తిరిగి తన ఇల్లు జేరెను. ఈసాకు ఎంతమంచిబాలుడు! బాలమిత్రులారా! మీరును మీ తల్లిదండ్రులమాటలకు విధేయత జూపవలెనని ఈసాకు మిమ్ము పురికొల్పుటలేదా?

కొంతకాలమునకు శారా చనిపోయెను. తల్లిచాటున అతి సుకుమారముగా పెరిగిన ఈసాకు తల్లిని మరువలేక సదా దుఃఖించుచుండ, తండ్రి అతనికి జతకొరకు చక్కని కన్నియయగు రబ్బేక్కనిచ్చి పెండ్లిచేయ, కొంతకాలమునకు

తల్లిపైగల బెంగవీడి, భార్యతో సంతసముగా నుండెను. ఈసాకు మంచిమాదిరిగల భర్తయని వేదవాక్యము నొక్కి చెప్పుచున్నది.

ఇతనికి ఏశావు, యాకోబులను పుత్రులు గలిగిరి. ప్రేమగల తండ్రి అయినను ఏశావును, యాకోబునకంటె అధికముగా ప్రేమించెను. సహజముగా తండ్రులంతా పెద్దకుమారునిగదా ప్రేమించెడివి. కాన నిది అన్యాయముకాదు అని మనము తెలిసికొనవలెను.

ఈసాకు, బాల్యమున, విధేయతగల బాలుడనియు, యౌవ్వనమున మాదిరియైన భర్తయనియు, భక్తిగల పురుషుడనియు, వృద్ధాప్యమున ప్రేమగల తండ్రియనియు నేర్చుకొనుచున్నాము.

---

# బాలమిత్ర టపా

ఓ నా ప్రియబాలమిత్రా!

ఒకనాటి సాయంకాలమున సమూయేలు, యోసేపుయను ఇద్దరు కుఱ్ఱవాండ్రు దారిన పోవుచుండగా నొక ఫలభరితమైన మామిడి చెట్టువైపుచూచి దొంగతనముగా కొన్ని




పండ్లను గోసిరి. ఇంతలో స్వంతవాడువచ్చి "ఎందుకు మీది కానిచెట్లును ముట్టితి"రని యడుగగా, సమూయేలనువాడు "మేమెరుగమనెను" అందుకతడు ఆ బాలురతో నిట్లని పాడెను.

పాట

1. పలుకుడి నిజమును బాగుగను
భయమును గలుగదు యెప్పుడును
కలుగును పేరను మంచిగను
కాచును దేవుఁడు తప్పకను॥

2. అనువుగ నాటల యందునను
మనకే యాపదవచ్చినను
ధనమును బోయెడి సమయమునఁ
అనరాదెప్పు డబద్ధమును ||

3. అప్పుడు యోసేపు నిజమే
పండ్లను కోసితిమనెను
అంతనాస్వంతదారి
తిరుగాసమూ యేలుతో ||

4. దొంగవై నీవుండినను ఒక
దొడ్డవాక్యము దెల్పెదఁ
భంగపడిన నబద్ధమాడుట
బాగులేదని యెంచుము||

నీతి || గీ|| పాఠశాలలందు బాలురు కొందరు
తప్పుచేసిదాని గప్పిపుచ్చ
బొంకుచుందురదియు బూర్వపుదానితో
గలియ రెండుకావె కానిపనులు ?

అద్దంకి గ్రేశమ్మ,
వాల్తేరు.

C. L. S. PRESS, MADRAS—1915